Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ ఆగస్టు నెల 7 వ తేది శుక్రవారం [నె 31 రు.

## ఇండియాకు బ్రిటిష్‌వారి స్వపరిపాలనా వాగ్దానము.

భారతదేశ రాజకీయ వ్యవహారాలను గూర్చి ఇంగ్లాండులోను అమెరికాలోను గల పత్రికలు ఎక్కువగా విమర్శించి వ్రాస్తున్నవి. మాంచెస్టరు గార్డియను అను ఇంగ్లండుదేశపు పత్రిక చాలా ఉదారమైన భావాలు కలది. ఆ పత్రిక యిట్లు వ్రాయుచున్నది—ఇండియాకు స్వపరిపాలనా స్వాతంత్ర్యం తప్పకుండా ఇస్తామని బ్రిటిష్ గవర్నమెంటువారు వాగ్దానము చేసియున్నారు. ఆ వాగ్దానము రద్దుకాకుండా యధావిధిగానే నిలిచియున్నదని ఇండియా కార్యదర్శియైన అమెరీగారు నొక్కివక్కాణించారు. కాబట్టి అమెరీగారు చెప్పిన ఆ మాటలను భారతీయులున్నూ, ఆంగ్లేయులున్నూకూడా శ్రద్ధగా గమనించవలసియున్నది. సర్ స్టాఫర్డు క్రిప్సుగారు ఇండియాకు బ్రిటిష్ గవర్నమెంటు తరఫున వచ్చియుండిరి. అదివరలో బ్రిటిష్‌వారు చేసిన స్వాతంత్ర్య వాగ్దానమును క్రిప్సుగారు రద్దు చేయలేదు. క్రిప్సుగారి రాయబారములు విఫలమైనంత మాత్రమున బ్రిటిష్‌వారు తమ వాగ్దానమును ఉపసంహరించుకొన్నారనిగాని వదలుకొన్నారనిగాని కొందరు అర్థం చేసుకొన్నారు. కాని అటువంటిది జరగలేదు సరికదా, క్రిప్సుగారు సూచించిన షరతు పద్ధతులను నిరాకరించినది కాంగ్రెసు పార్టీవారే. అందుమూలంగా మస్లిం లీగువారుకూడా నిరాకరించారు. కామన్సు సభలో యీ విషయమై ఒక సభ్యుడు ప్రశ్న అడిగితే, అమెరీగారు గత ఏప్రిల్ 28 వ తేదీని యీ క్రింది రీతిగా జవాబు చెప్పియున్నారు :—

> "(క్రిప్సుగారి) షరతు సూచనల చిత్తు ప్రణాళికను ఉపసంహరించుకొనడమైనదనే మాటకు అర్థమేమిటని అడుగుచున్నారు. భారతదేశానికి వీలైనంత త్వరలో, సంపూర్ణ స్వాతంత్ర్యం పొందవలెననే బ్రిటిష్ సంకల్పమును మాత్రం బ్రిటిష్‌వారు ఉపసంహరించుకొనలేదు. తమ దేశ పరిస్థితులకు తగిన రీతిగా, భారతీయులే తగిన ప్రభుత్వ విధానమును నిర్ణయించుకొని సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందవచ్చునని యెడి బ్రిటిష్ సంకల్పమును ఉపసంహరించుకోలేదు."

ఇటీవల కాంగ్రెసు వర్కింగుకమిటీ చేసిన ప్రకటన యనంతరం కామన్సు సభలో ఈ విషయం చర్చ చేయబడెను. జూలై 30 వ తేదిని ఇండియా కార్యదర్శి ద్వారా బ్రిటిష్ గవర్నమెంటువారు యీ క్రింది రీతిగా తిరిగి నొక్కివక్కాణించిరి :—

> "భారతీయులు సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందుటకు సంపూర్ణమైన అవకాశము నొసంగుటకే బ్రిటిష్‌వారు సంకల్పించియున్నారు."

కాంగ్రెసుసభవారు సమష్టి సత్యాగ్రహం సాగిస్తామని బెదరించుటవల్లనే, బ్రిటిష్‌వారు అదివరకు చేసిన వాగ్దానమును ఉపసంహరించుకొనుట సంభవించినదని శత్రు రాజ్యాలవారు తమ రేడియోలో చెప్పుచున్నారు. కాని, యిటువంటి అపార్థ కల్పనలను అమెరీగారు యీ క్రింది విధంగా బాగా ఖండించారు :—

> "కాంగ్రెసు పార్టీవారు ఏ పద్ధతిని అవలంబించినప్పటికీ, దానితో నిమిత్తంలేకుండానే, బ్రిటిష్‌వారి సంకల్ప స్వరూపం యథావిధిగా ఉంటుంది"

ఇండియాలో ఉన్నటువంటి ఆంగ్లేయ వర్తక సంఘముల హక్కు భుక్తములకు భంగం కలుగకుండా స్వపరిపాలనా విధానంలో కొన్ని రక్షణ నిబంధన లుండగలవని మీరు అభయహస్తమిచ్చెదరా యని ఇండియా కార్యదర్శిని కామన్సు సభలో అడుగగా అమెరీగారు ఖండితంగా యిట్లు జవాబు చెప్పిరి :—

> "యుద్ధానంతరం భారతీయులు తమంతట తాము నిర్ణయించుకొనెడి స్వపరిపాలనా విధానమును బ్రిటిష్‌వారు ఆమోదిస్తారు కాని, ఇండియాలోని ఆంగ్లేయ వర్తకుల హక్కులను కాపాడగల రక్షణ నిబంధనలు ఉంటేనే తప్ప భారతీయులు నిర్ణయించుకొనే స్వతంత్ర పరిపాలనా విధానమును బ్రిటిష్‌వారు అంగీకరించజాలరనే షరతు లేదు. అటువంటి రక్షణలు ఆంగ్లేయ వర్తకులకు ఇండి

యాలో కావలసినయెడల ఉత్తరత్ర ఏర్పడే భవిష్యద్భారత ప్రభుత్వమువారితో రాయబారములు జరుపుకొని అట్టి ఏర్పాట్లు చేసికొనుట యుక్తము. "

అదేవిధంగా ప్రభువుల సభలో డివాన్షయిరు ప్రభువుకూడా చెప్పియున్నాడు :—

> " భారతదేశం మనకు లోబడియుండే రాజ్యం అనే పాతకాలపు భావాలు పోయినవి భారతదేశం కూడా మనతో సమాన భాగస్వామిగా ఉండవలెననే భావాలు ఏర్పడియున్నవి. అటువంటి భావాలకున్నూ, ప్రత్యేక రక్షణ నిబంధనలు ఇండియాలో ఆంగ్లేయుల కుండవలెనను భావములకున్నూ పొత్తు కలియదు "

ఇంగ్లాండులోనే ఒక గొప్ప జమీందారీప్రభువు ఆ రీతిగా ఖండితంగా చెప్పియుండిన సందర్భంలో, జపానువాళ్లు సైగానునుండి రేడియో ద్వారా ఇంగ్లీషులో ఏమని ప్రచారం చేసినారో చూడండి :—

> " బ్రిటిష్ ప్రభువులు, లక్షాధికారులు, శ్రీమంతులు, సామంతులు, తమ భాగ్యభోగ్యములను వదలుకొనుటకు ఇష్టంలేక భారతదేశంలోని ప్రజలలో నూటికి 90 వంతు మందికి యిష్టంలేకపోయినా, ఆ దేశంలోని 40 కోట్ల ప్రజలను తామే లోబరచుకొని పరిపాలించవలెనని సంకల్పించుకొనియున్నారు. కనుక యిటువంటి బ్రిటిష్‌వారిని ఎదిరించుటకొరకే, కాంగ్రెసు సభవారు తగిన ప్రతిక్రియ చేయదలంచుచున్నారు."

శత్రు రాజ్యాలవారు తమ రేడియోలో కాంగ్రెసువారి వార్ధా తీర్మానమునే ఎక్కువగా మెచ్చుకొనుచున్నారు. శత్రు రాజ్యాలవారు తాము సాధించుచున్న యుద్ధ విజయమువల్ల బ్రిటిష్ వారికి ఎక్కువగా ఒత్తిడిని కలుగజేసి, అందుమూలంగా కాంగ్రెసు సభవారి కోరికలను బ్రిటిష్‌వారు నెరవేర్చునట్లుగా చేయగలమనియు, కాంగ్రెసు సభవారు తాము కోరెడి కోర్కెల విషయంలో పట్టువీడకుండా ఉండవలెననియు, శత్రువులు తమ రేడియోద్వారా కాంగ్రెసు పార్టీవారిని హెచ్చరిస్తున్నారు. సైగాను రేడియోలో జూలై 30 వ తేదిని యీ క్రింది రీతిగా చెప్పబడెను :—

> " స్టాలిన్‌గ్రాడు ప్రమాదావస్థలో ఉంది. ఆలెగ్జాండ్రియాకూడా అట్టి స్థితిలోనే ఉన్నది కనుక, మీకు ఎక్కువ కోరికలు లభించగలవు. "

కాని, ప్రత్యక్ష విషయములను పరిశీలిస్తే పై అభిప్రాయము దురభిప్రాయమని తెలియగలదు.

భారతదేశము మీదకు శత్రువు దండెత్తుటకు సిద్ధముగా ఉన్నాడు గనుకనే, యుద్ధం జరిగినంత కాలము ఏవిధమైన కోరికలున్నూ ఇప్పుడు నెరవేర్పబడజాలవు. ఇప్పుడు భారతీయుల కోరికలను తీర్చినయెడల, ఇండియా ప్రభుత్వమునకే అపాయం కలుగును. భారత దేశమునుగాని, చైనానుగాని రక్షించుటకు బ్రిటిష్‌వారికి సాధ్యము కాదు. అందువల్లనే వార్ధా తీర్మానమును అమెరికను ప్రముఖులును, బ్రిటిష్ ప్రముఖులును అంత తీవ్రంగా ఖండించవలసివచ్చినది. కాని, భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యమును యిచ్చుటనుగూర్చి బ్రిటిష్ పత్రికలుగాని, బ్రిటిష్ గవర్నమెంటుగాని, స్పష్టంగానే చెప్పుచున్నవి.

క్రిప్సుగారి రాయబారములు విఫలమైనందుకు సంతోషిస్తూ శత్రు పక్షమైన ఫిన్లండు దేశంలోని హెల్సింకి నగరపు రేడియోలో ఏప్రిలు 13 వ తేదిని యిట్లు చెప్పబడెను :—

> " ఇండియాలో క్రిప్సు రాయబారం భగ్నమగుటవల్ల అక్ష రాజ్యాలవారికి గొప్ప విజయము లభించినట్లుగా ఉంది. "

క్రిప్సు రాయబారము విఫలమైనందుకు చైనా ప్రభుత్వమువారు తమ ఆశాభంగమును వెల్లడించిరి. అందుకు జపానువారు తమ సంతోషమును తమ రేడియోలో వెల్లడించిరి. నాటినుండి నేటికి మూడున్నర మాసాలు గడచినవి. శత్రువులు మాత్రము నిరంతర ప్రచారము చేయుచున్నారు. బ్రిటిష్‌వారియెడల భారతీయులలో ద్వేషమును పురిగొల్పుచున్నారు.

క్రిప్సుగారు ఇండియాకు వచ్చినప్పుడు వారితో కలిసి సహాయంగా వారి సంప్రతింపులకు తోడ్పడిన ప్రొఫెసరు కూప్లాండుగారు తమ పుస్తకములో వ్రాసికొనిన యీ క్రింది ప్రశ్నోత్తరములను గమనించవలెను. పత్రికా ప్రతినిధులు ఢిల్లీలో క్రిప్సుగారిని ప్రశ్నలు అడుగగా క్రిప్సుగారు యీ క్రింది సమాధానములను చెప్పిరి :—

ప్రశ్న.—నూతన భారతదేశ సమితి ఇంగ్లాండుతో సంబంధం వదలుకొనుటకు అధికారం కలిగియుండునా ?

జవాబు.—అవును కలిగియుండును.

ప్రశ్న.—ప్రపంచంలోని ఏ యితర రాజ్యంతోనైనను ఒడంబడిక పత్రములను వ్రాసికొనుటకు హక్కుకలదై యుండునా ?

జవాబు.—అవును.

ప్రశ్న.—గవర్నరు జనరలు సంగతి ఏమి?

జవాబు.—స్వపరిపాలనా విధానం నిర్ణయించెడివారే ఆ విషయంకూడా పరిష్కరిస్తారు.

ప్రశ్న.—బ్రిటిష్‌వారు ఎట్టి వ్యవహారదశలో ఇండియాను విడిచిపోతారు?

జవాబు.—నూతన రాజ్యాంగవిధానం నిర్ణయం అయినపిమ్మట, ఆ విధానమును అమలు పరచుటకు బ్రిటిష్‌వారే పూనుకొనెదరు. క్రొత్త ప్రభుత్వం అమలులోనికి రాగానే, ప్రాత అధికారులు తమ అధికారమును భారతీయులకు ఒప్పజెప్పి ఇండియానుంచి వెళ్లిపోయెదరు.

ప్రశ్న.—మీరు ఇచ్చేది ఏమిటి? "స్వాతంత్ర్యం" అనేది ఒక్కటే కావాలి.

జవాబు.—"సంపూర్ణ స్వపరిపాలనము" అనే సులభశబ్దమును ఉపయోగించినాము. ఆ మాటకు నిర్వచనంకూడా చేసినాము. కాబట్టి సంపూర్ణమైన స్వయంనిర్ణయాధికారమునకును స్వపరిపాలనాధికారమునకును అపార్థముల కవకాశం లేదు.

# ఉత్తర ధృవ సముద్రం ద్వారా రష్యాకు సప్లయిలు.

ఉత్తరధృవ సముద్ర ప్రాంతంమీదుగా అమెరికాయున్నూ ఇంగ్లాండున్నూ రష్యాకు ఆయుధ సామగ్రులను అనేకము ఓడలమీద రవాణా చేయుచునే యున్నవి. జర్మను విమానాలు, జర్మను యుద్ధనావలు ఎన్ని విధాలుగా అడ్డగించుచున్నప్పటికీ, వాటిని తప్పించుకొని, లేదా వాటిని ధ్వంసంచేసి ఆ యుద్ధ సామగ్రులు చేర్చబడుచునేయున్నవి. ఒక నావల మురా యిటీవల యీ వేసంగిలో రష్యాకు పంపబడింది. ఆ నావల మురాలోని ఒక అమెరికా నావలోని అమెరికను ఇంజనీరగు ఆర్. డి. వింబర్లీగారు తమ ప్రయాణ విశేషములను వివరించినారు. వారికి చేతి ఎముక యొకటి ఆ ప్రయాణంలో విరిగింది. అక్కడి మంచుగడ్డల చలిచేత శరీరం అక్కడక్కడ విపరీతంగా పగిలి పుండ్లయినవి. కాని యిప్పుడు స్వస్థత జెందుచున్నారు. అమెరికాలో టెక్సాసు పరగణాలో హ్యూస్టను పట్టణంలో ఒక ఆస్పత్రిలో ఉన్నారు. ఆయనతో కలిసికొని మాట్లాడగా ఆయన యీ క్రింది విశేషాలు చెప్పిరి :—

"జర్మనులు మానావల మురాను అడ్డగించుటకు సముద్రంమీద ఎన్ని యుద్ధసన్నాహములు చేయవలెనో అన్ని సన్నాహములు చేసారు. ఒక్క గుర్రపు దళాలను మాత్రం సముద్రంమీదకు జర్మనులు తీసికొని రాలేకపోయినారు. మంచుగడ్డతో సముద్రం పూర్తిగా ఘనీభవించియున్నట్లయితే, గుర్రపు దళాలనుకూడా మా ఓడలమీదకు జర్మనులు దండెత్తించెడివారే.

మా నావలమురా ఉత్తరధృవ సముద్రంలోకి ప్రవేశించిన తర్వాత, ఒక వైపున మంచుగుట్టలున్నాయి. మరొకవైపున జర్మను జలాంతర్గములున్నాయి. మంచుగుట్టలవద్ద మూడు జర్మను యుద్ధనావలు దాగిఉన్నాయి. బ్రిటిష్ యుద్ధనావలు మా నావల మురావెంట కాపలాగా వస్తున్నాయి. ఒక యుద్ధనావలోని కమాండరు (నౌకాదళపతి) ఏమైనాసరే, తన నావ నాశనమైనాసరే, యని తెగించి, సాహసించి, పూర్తియైన గమనవేగంతో ఆ యుద్ధనావను ఆ మంచుగుట్టలమీదకు నడిపించాడు. ఆ నావ బ్రహ్మాండంగా ఆ మంచుగుట్టలగుండా చొచ్చుకొని, వాటి వెనుకనున్న మూడు జర్మను యుద్ధనావలమీదను ఫిరంగులను బారుచేసి కాల్చినది. ఆ మూడు జర్మను యుద్ధనావలు వెంటనే ముంచివేయబడినవి. ఆవిధంగా మా నావలమురా రక్షింపబడింది.

రష్యాకు సరకులను చేర్చేడి యీ బ్రిటిష్ అమెరికను నావలలోనివారు అనేక ప్రాణాపాయములకు తెగించి అష్టకష్టాలు పడుచున్నారు. కాని, అందువల్ల రష్యాకు ఆ ఉత్తరధృవ ప్రాంత సముద్రతీరపు రేవులలోనికి నిరంతరంగా సామగ్రులు దిగుమతి యగుచునేయున్నవి.

రష్యనులు చాలా మొండి పట్టుదలగలవాళ్లు. ఓడమీదనుంచి రష్యను రేవులోనికి టాంకులను దింపునప్పుడు, ఆ టాంకుయొక్క ఫిరంగులు మందుగుండ్లతో పూర్తిగా బారుచేయబడిన పిమ్మటనే దింపబడుచున్నవి. ఆ రేవులమీద ప్రతి రాత్రియును జర్మను విమానాలు బాంబులువేసి, రేవులోని కట్టడములను పాడుచేస్తూనే ఉన్నవి. కాని రష్యనులు పగలంతా ఆ పాడైన భాగములను తిరిగి మరమ్మతు చేయుచునేయున్నారు."

# వేలకొలది ఆకాశ గొడుగులు,

## అందుకొరకై ఇండియాలో తయారు చేయబడుచున్న సిల్కు గుడ్డ.

ఆకాశ గొడుగులను తయారుచేయుటకు సిల్కు గుడ్డ కావాలి. ఈ గొడుగులకు కట్టెడి టేపు కావాలి. ఆ సిల్కు గుడ్డను తయారు చేయుటకు పట్టునూలు సమృద్ధిగా సప్లయికావాలి. ఇవి సమృద్ధిగా ఎచట దొరకునో తెలిసికొని, అటు పిమ్మట ఆ సరకునకు ఆర్డరు యివ్వాలి. ఈ సిల్కు గుడ్డను తయారుచేయుట కొరకొక ఫ్యాక్టరీ ప్రత్యేకంగా ఇండియాలో పని చేయుచున్నది. రెండు రాష్ట్రింలలో, అనగా మద్రాసు రాష్ట్రింలోను, బెంగాలు రాష్ట్రింలోను ఫిలేచరు సిల్కు గుడ్డయొక్క ఉత్పత్తి రూ 18,50,000 లు కిమ్మతు వరకు వృద్ధిచేయబడును.

ఫిలేచరు సిల్కును అపారంగా జపాను దేశ మిదివరకు సప్లయిచేయుచుండెను. ఇప్పు డీసిల్కును జపాను సప్లయిచేయలేదు గనుక, ఇండియా సప్లయిచేసి ఆ వ్యాపార లాభమును పొందగలదు. ఈ కొత్త ఆర్డరులవల్ల మైసూరు సంస్థానంతో సహాచేరిన మద్రాసు రాష్ట్రిమున్ను, బెంగాలు రాష్ట్రిమున్ను యీ వ్యాపార లాభమును పొందగలవు. మద్రాసు రాష్ట్రిములో యీ ఫిలేచరు సిల్కు ఉత్పత్తి ప్రత్యేకంగా మద్రాసు గవర్న మెంటువారి కంట్రోలులోనే ఉండును. మైసూరు సంస్థానంలో కొంతవరకు గృహ పరిశ్రమగా ఫిలేచరు సిల్కు తయారగుచున్నది. కనుక ప్రయివేటు కంట్రాక్టులద్వారా కొంతవరకున్ను మైసూరు సంస్థాన ప్రభుత్వంద్వారా కొంతవర కున్ను ఫిలేచరు సిల్కు సప్లయిచేయబడును. బెంగాలు రాష్ట్రిములో ప్రయివేటు కంట్రాక్టుల ద్వారానే ఫిలేచరు సిల్కు గవర్న మెంటుకు సప్లయి చేయబడును.

---

# ఈజిప్టులో యుద్ధ పరిస్థితి.

ఈజిప్టులో యుద్ధ పరిస్థితి ప్రస్తుతం మనకు అనుకూలంగానే చాలవరకు తేటపడుచున్నది. జర్మను సేనానియగు రామెలుయొక్క సేనలు వెనుకకు తరుమబడినవి. మన 8 వ సైన్యము కోస్తావెంట ముందుకు చొచ్చుకొని పోగల్గినది. అచటి బ్రిటిషు సేనలకు అధిపతియైన సర్ ఆకిన్లెక్కుగారివద్ద ఓర్పు ఎక్కువగా ఉన్నది. ఆకిన్లెక్కుగారి సేనల స్థితి అనుదినము చక్కబడు చునేయున్నది. కాని రామెలు సేనానికికూడా రోజు రోజుకు క్రొత్త జర్మను సేనలువచ్చి చేరు చున్నవి.

సర్ ఆకిన్లెక్కుగారి బ్రిటిష్ విమానదళము చాలా సమర్థముగా పనిచేయుచున్నది. క్రింద నడచెడి మెట్ట పటాలములకు వెన్వెంటగా పైన బ్రిటిష్ విమానదళము నడచుటవల్లనే, మెట్ట పటాలములు నిర్భయముగా పోరాడగల్గుచున్నవి.

క్రీటు దీవిలో జర్మను విమానములు చాలా ఎక్కువగా సమకూర్పబడి యున్నవని తెలియు చున్నది. ఉత్తరాఫ్రికా సముద్రతీరమునకు క్రీటు దీవి 200 మైళ్ల దూరములోనే ఉన్నది. ఆ జర్మను విమానాలు సైప్రసుమీదగాని సిరియామీదగాని, ప్రయోగింపబడు నిమిత్తమే అచట సమకూర్పబడి యుండవచ్చును. రష్యాలో, కాకససులోనికి జర్మను సేనలు కొంతదూరము ప్రవేశించిన పిమ్మటనే, క్రీటులోని జర్మను విమానములు సిరియామీదకు పంపబడవచ్చును. లేదా టర్కీమీదనే జర్మనులు దండెత్త దలంచితే, అప్పుడా విమానములు టర్కీమీదనే ప్రయోగింపబడవచ్చును. లేదా ఈజిప్టులోనున్న రామెలు సేనాని సహాయార్థం అవి యీజిప్టుకు పంపబడవచ్చును. విమానాలమీదనే రామెలు సేనానికి కొత్త జర్మను సేనలు పంపబడుచున్నవి. ఆ విధంగా జర్మను సేనలను తీసికొని వచ్చు చున్న జర్మను విమానములు ఇటీవల బ్రిటిష్ విమానములచే అడ్డగింపబడెను. ఆ జర్మను విమానములలో 12 విమానాలు చెడగొట్టబడెను.

# అర నిమిషంలో అద్భుత విజయం.



ఇతడు బ్రిటిష్ విమానదళంలో ఉన్న దక్షిణాఫ్రికా వైమానికుడు. ఇంగ్లండువద్దనున్న ఇంగ్లీషు చానెలు సముద్రంమీదకు గస్తీ తిరుగుటకై తన విమానంతో ఒక నాటి మధ్యాహ్నం వెళ్లినాడు. అరనిమిషకాలంలో, తన కెదురైన రెండు జర్మను విమానాలను పడగొట్టి, వెంటనే తన విమానంలోనే రేడియోద్వారా విమానాశ్రయాధికారికి ఆ విషయం తెలియజేశాడు. 20 నిమిషములలో తన మకాముకు తిరిగివచ్చి చేరినాడు.

---

# టోగో! – టోజో! - జో! జో!

జపాను అనే రాజ్యం శాంత మహాసముద్రంలో ఉన్న ఒక లంక. జపానుదేశంలో సుమారు 9 కోట్ల జనాభా ఉంటుంది. జపాను దేశం దేనికి ప్రసిద్ధి అని అడగండి. అగ్ని పర్వతాలకు, భూకంపములకు ప్రసిద్ధి కెక్కినది. ఎప్పుడు భూకంపం వస్తుందో జపానులోని ప్రజలకు తెలియదు. ఎప్పుడు వచ్చినా రావచ్చును. భూకంపం రాగానే లక్షలకొలది యిళ్లు కూలి పడిపోతూ ఉండడం, తిరిగి ఆ యిళ్లు కట్టుకొనడం అచటి ప్రజలకు అలవాటై పోయింది. భూమి కంపించినప్పుడు భూమి గజగజలాడినట్లుగా ఊగులాడుతుంది. అందుచేత జపానులో అట్టలతో కట్టిన యిళ్లుకూడా అనేకం ఉన్నాయి. అటువంటి యిళ్లు విరిగిపడిపోయినా, విశేష నష్టం లేదు. అగ్నిపర్వతాలుకూడా అప్పుడప్పుడు ద్రవించిన పాషాణమును భూగర్భమునుండీ పైకి ఎగజిమ్ముతూ ఉంటాయి. ఆ ద్రవ పాషాణము గంధకద్రవ్యములతో కూడుకొనియుంటుంది. అగ్నివర్షమువలె పైనుండి క్రిందకు పడి పట్టణములును, పల్లెలును ఆ వెల్లువలపాలై భస్మమై పోతాయి. అందువల్ల ప్రజలకు ఈ అగ్నిపర్వతాలు ఎప్పుడు ప్రకోపించునో తెలియదు. హఠాత్తుగా తుపాను వచ్చినట్లుగానే, అగ్నిపర్వత మేదైనా ప్రకోపించవచ్చును. ఇటువంటి అగ్నిపర్వత సంక్షోభములున్నూ, ఇటువంటి భూకంపములున్నూ ఆ జపానుదేశంలో తరచు సంభవించే విషయములై యున్నవి. ఇటువంటి ప్రచండ సహజ సంక్షోభములతో తల్లడిల్లెడి రాజ్యం ఎక్కడ ఉన్నదయ్యా అంటే, శాంతమహాసముద్రంలో ఉంది. శాంతమహాసముద్రంలో ఉన్న యీ దీవి అశాంతికి పుట్టినిల్లుగా, సంక్షోభముల నిక్షేపముగా వెలసియున్నది. ఇంతకన్నా సృష్టిలో ఇంకొక విపరీతం లేదు. ఇంటి పేరు కస్తూరివారు, కాని ఇంటిలో గబ్బిలముల కంపు అన్నట్లుగా ఉంది.

ఇటువంటి జపాను రాజ్యంలో ఉన్న ప్రజల యొక్క మతము బౌద్ధమతము. "అహింసా పరమోధర్మః" అని బుద్ధుడు బోధించిన ప్రశాంతమైన మతమే వీరిది. కాని, జపాను రాజ్యంలో యీ ప్రశాంతమైన సాత్వికతత్వం ప్రజల

స్వభావంలోగాని, రాజ్యాంగ నీతిలోగాని కన్పించదు. జపానులో సైనిక శాఖవారిదే అధికార ప్రాబల్యం యావత్తూ—వాళ్లకు ఇతర రాజ్యాలు గెల్చుకొని, ఆక్రమించవలెననే దాహం తప్ప ఇంకొకటి లేదు. రాజ్యదాహం, రక్తదాహం ప్రబలమై పోయింది. ఆత్మహత్య చేసికొనడం అనేది జపానువాళ్లల్లో చాలా గొప్ప ఘనకార్యం. ఈ ఆత్మహత్యనే జపాను భాషలో "హరికెరి" అంటారు. జపాను చక్రవర్తి చనిపోయినట్లయితే, చక్రవర్తియొక్క శవముతో సహా, ప్రభు భక్తితత్పరుడైనవాడు ఇంకొకడు ఆత్మహత్య చేసికొంటాడు. చక్రవర్తి శవము ఒంటరిగా పోగూడదనియు, ఆ చక్రవర్తి శవంతోబాటు మరొక గొప్పవాని శవం కూడా స్మశానమునకు పోవలెననియు వాళ్ల దేశంలో ఏర్పడియున్న యమమర్యాదగా ఉంది. మన హిందూదేశంలో ఒకప్పుడు సహగమనం అనే క్రూరాచారం ఉండేది. బ్రిటిష్ ప్రభుత్వము వచ్చిన తర్వాత యీ దురాచారం అణచివేయబడినది. భర్త చనిపోతే, భర్త శవంతోబాటు భార్యను కూడా దహనంచేసేవాళ్లు. ఆవిధంగా చనిపోయిన భర్తతో బ్రతికివున్న భార్య తగులబడినట్లయితే, అటువంటి భార్య దేవతలలో చేరుతుంది అని కొనియాడేవారు. అటువంటి క్రూరరాక్షస దురాచారమువంటిదే నేటికిన్ని జపానులో ఉంది. సైనికపక్షంవారిదే అధికారం అగుటవల్ల జపానువాళ్లు రక్తదాహంతో తాండవమాడుతూ ఇతర రాజ్యాలమీదకు క్రూరంగా, అక్రమంగా దండయాత్రలు సాగిస్తున్నారు. ప్రశాంతమైన అహింసా తత్వంతోకూడిన బౌద్ధమతం గల రాజ్యంలో ప్రస్తుతం రాక్షసతత్వం విజృంభించి ఉన్నది. వారి బౌద్ధమతం వట్టి నేతిబీరకాయవంటిదిగా ఉంది. వారు అవలంబించినది బౌద్ధ మతం. వారిలో అవతరించినది రౌద్ర మతం. శాంతమహాసముద్రంలో ఉన్న అగ్నిపర్వతాల అశాంతి రాజ్యం ఇది.

ఈ రాజ్యానికి ప్రస్తుతం టోజో అనే అతను ప్రధాన మంత్రిగా ఉన్నాడు. టోగో అనే అతను విదేశాంగ వ్యవహార మంత్రిగా ఉన్నాడు. వీరి తత్వంతో ఏకీభవించినటువంటి సైనిక పక్ష ప్రముఖులే మరికొందరు మంత్రులు ఉన్నారు. ఈ మంత్రివర్గమువారే జపానును అనేక రాజ్యాలమీదకు ఉసికొల్పుతున్నారు. జపాను ప్రజలను యుద్ధాలకు పురికొల్పుతున్నారు. జపాను సేనలను రణరంగములకు ఉరికించుచున్నారు. కాని యింత వీరావేశం వారు పుట్టించి సాధింపగల్గినది ఏమిటి? అని బాగా ఆలోచిస్తే బర్మాను, మలయాను, సింగపూరును జయించారు. ఫిలిప్పయిను లంకలను మరికొన్ని లంకలను ఆక్రమించారు.

కాని, మొట్టమొదట జపానువారు చైనామీద దండయాత్ర సాగించారు. అయిదేళ్లు దాటినవి. ఇంకా చైనాలో యుద్ధం, చీమ కాశీకి ప్రయాణమైనట్లుగానే ఉంది. బ్రహ్మాండమైన చైనా రాజ్యం 45 కోట్ల జనాభాగల పెద్ద రాజ్యం. ఏనుగును ఎలుక పట్టి లాగుతున్నట్లుగా ఉంది. అక్కడ ఒక రోజున ఒక ఊరును జపానువారు పట్టుకొంటే, ఆ ఊరినే మరునాడు తిరిగి చైనావారు ఆక్రమించుకొంటున్నారు. ఉయ్యాలా! జంపాలా! అన్నట్లుగా, వారి వశంలోకి వచ్చిన ప్రాంతం వీరి వశంలోకీ, వీరి వశంలోవున్న ప్రాంతం వారి వశంలోకీ ఊగులాడుతూ ఉండడమే గాని, అంతులేని మొండి ఆటగా ఉంది. చైనాలో జపాను సైన్యం యీవిధంగా ఉయ్యాల ఊగుతూనే ఉంది.

ఇది ఇట్లా ఉండగా, అమెరికాతో జపాను విరోధం పెట్టుకొని అమెరికామీద యుద్ధం ప్రకటించింది. అమెరికాతో యీ చిన్న జపాను రాజ్యం యుద్ధం చేసేటటువంటిదా? నక్క ఎక్కడ నాగలోక మెక్కడ? అమెరికాకుగల సైన్య మెక్కడ? జపాను సైనిక సంఖ్య ఎక్కడ? అమెరికాకుగల నౌకాబల మెక్కడ జపానుకుగల నౌకాబల మెక్కడ? అమెరికాయొక్క అఖండ అయిశ్వర్య మెక్కడ? జపానుయొక్క నడుమంతరపు సిరి ఎక్కడ? అమెరికాయొక్క అంగబలమునకూ, అర్థబలమునకూ, ఆయుధ బలమునకూ జపాను జవాబు చెప్పగలదా? అఖిల ప్రపంచానికి అప్పు యిచ్చి, ఆయుధాలు సప్లయిచేసే బ్రహ్మాండమైన అమెరికా రాజ్యం ఇంకా తన మూడో కన్ను పూర్తిగా తెరువలేదు. తెరిస్తే జపాను లంకను భస్మం చేసి, "తస్మాత్! జాగ్రత! జాగ్రత!" అని జర్మనీకిన్నీ యితర అక్షరాజ్యాలకుకూడా జ్ఞాన చక్షువులను తెరిపించగలదు. అటువంటి అమెరికా రాజ్యానికి చెందిన అలాస్కా అనే ప్రాంతానికి చేరువలో ఉన్న అలూషియను దీవులమీదకు

జపాను దండెత్తింది. అందుకనే అమెరికా వారు అలాస్కాలోను అలూషియను దీవులలోను 15 కోట్ల డాలర్లు ఖర్చుచేసి విమానాశ్రయములను, నౌకాశ్రయములను, సైనిక స్థావరములను నిర్మించుచున్నారు.

రష్యాయొక్క తూర్పు భాగమైన సైబీరియా సరిహద్దున్నూ, చైనా సరిహద్దున్నూ కలిసి వున్నవి. సైబీరియాయున్నూ, అమెరికాలో చేరిన అలాస్కాయున్నూ సమీపంగా ఉన్నాయి. రెండింటికీ మధ్యలో అలూషియను దీవులు, రెండు దూలాలకు కట్టిన ఉయ్యాల తాడువలె ఉన్నవి. రష్యామీదకు, అనగా సైబీరియా మీదకు దండెత్తవలెననే సంకల్పంన్నూడా జపానుకు కలుగుచున్నది. అందుకనే 10 లక్షల జపాను సేన సైబీరియా సరిహద్దులో ఉత్తర చైనాలోని మంచూరియాలో చేర్చబడినట్లుగా వార్తలు వచ్చాయి. ఆ సరిహద్దులవద్దనే రష్యాలోని సైబీరియాలో 6 లక్షల రష్యను సేన చేర్చబడింది. సైబీరియా కోస్తా యావత్తూ జపానువాళ్లు ఆక్రమించవలెననే ఉద్దేశంతోనే అలూషియను దీవులలో ఒకటి రెండు చోట్లకు చేరినట్లుగా తెలియుచున్నది.

ఇటు రష్యాలోని సైబీరియామీదకు దండెత్తుటకున్నూ, అటు అమెరికావారి అలాస్కామీదకు దండెత్తుటకున్నూ ఎటు వీలైతే అటు ఊగుటకు మధ్యనున్న ఉయ్యాలతాడువంటి అలూషియను దీవులలో జపాను సేనలు ప్రవేశించవలెనని జపాను ప్రధానియగు టోజోగారున్నూ, జపాను విదేశాంగ మంత్రియగు టోగోగారున్నూ ఒక గొప్ప ఎత్తు వేసినారు. కాని, అటు అమెరికామీద దండెత్తుటకుగాని, ఇటు రష్యామీదకు దండెత్తుటకుగాని జపానువంటి చిన్న రాజ్యానికి ధైర్యం చాలడం లేదు. ఉయ్యాలలో ఎక్కి కూర్చున్నారు గాని, ఎటు ఊగవలెనో తోచడం లేదు. ఆ రెండు పెద్ద రాజ్యాలమీదకు దండెత్తే సమయంలోనే బ్రహ్మాండమైన చైనా రాజ్యం ఇదే సమయమని మరింత విజృంభించి చైనాలో జపానువాళ్లను నరయజ్ఞం చేస్తుంది.

జపాను మంత్రుల యుద్ధతంత్రం ఉయ్యాల ఊగుతోంది. ఉరితీయబడేవానికికూడా మెడకు ఉచ్చు తగిలించితే, ఉయ్యాల ఊగినట్లుగా ఊగి ప్రాణాలు విడుస్తాడు. అటువంటి ఉయ్యాల ఊగడమే జపానుకు ఆఖరుకు సంభవించేటట్లుగా ఉంది. ప్రస్తుతం జపాను అందుకనే విజృంభించకుండా స్తంభించివున్నది. ఈ ఉయ్యాల ఊగిన కొలదీ ఉచ్చు మరింత బిగుసుకుంటుంది. ఇటు అమెరికావారూ, అటు రష్యావారుకూడా జపానును ఉయ్యాల ఊపుతూ జోలపాట పాడే రోజులు సమీపిస్తున్నాయి.

జపానుజాలాకు ఉయ్యాలా!
ఉయ్యాలో యమ్మ! ఉయ్యాలా!
ఉయ్యాల జంపాల! జపానువాలా!
లేవద్దు! ఏడ్వద్దు! లేచితే తంతామ్!
జోల పాడీ నీకు జోలె చూపిస్తామ్!
పాటపాడీ నీకు పాడె కట్టిస్తామ్!
టోగోకుమార! జోజో! టోజోకుమార! జో! జో!

---

# అమెరికా సేనలు బ్రిటిషు సేనలు ఏకముఖముగా నిలువబడుట.

అమెరికాయున్నూ ఇంగ్లాండున్నూ అంతకంతకు ఎక్కువ కలిసి మెలిసి యుద్ధరంగంలో నిలువబడుచున్నవి. ఈ విషయమే విజయ సూచకంగా ధైర్య సూచకంగా ఉన్నది. అమెరికను సేనలు ఐర్లాండు ఉత్తర భాగములో దిగినవి. అటు పిమ్మట మరికొన్ని అమెరికను సేనలు ఆస్ట్రేలియాలో దిగెను. అచట మిత్ర మండలి సేనల కన్నింటికిని మాకార్థరు అను అమెరికను సేనాని ఆధిపత్యము వహించియున్నాడు. అమెరికను సైనికులు ఇప్పుడు లండను నగర వీధులలోనే తిరుగుచున్నారు. జనరలు స్టిల్వెలుగారు బర్మాలోని చైనా సేనలకు ఆధిపత్యము వహించి పనిచేసిరి. అప్పుడు అమెరికను వాలంటీరు దళము అచట చాలా పనిచేసెను. అమెరికను సేనలు ఇండియాకు కొన్ని చేరియున్నవి. న్యూగినియాలోకూడా అమెరికను సైనికులు దిగినట్లుగా వార్తలు వచ్చుచున్నవి. కనుక, అమెరికా, ఇంగ్లండుల మైత్రి కేవలం సఖ్యత కాదనియు అయిక్యత యనియు బోధపడుచున్నది.

# యుద్ధావసరములకై సర్కారు తీసికొనే భూములు.

ఇండియా డిఫెన్సు చట్టములోని రూల్సు ప్రకారముగా గవర్నమెంటువారు యుద్ధావసర ప్రయోజనములకై కొన్ని భూములను తీసికొనుచున్నారు. కొందరు భూస్వాములవద్దనుండియు, ఆ భూములయందు సాగుబడి హక్కు కలిగినట్టి రైతులవద్దనుండియు, సర్కారువారు తీసికొనుచున్నారు. యుద్ధానంతరం సర్కారువారికి ఆ భూములతో అవసరము లేనప్పుడు ఆ భూములను తిరిగి వదలుకోగలరు. అట్టి సందర్భములో ఆ భూములను వాటియొక్క మొట్టమొదటి అనాది ఖామందు అగు జమీన్‌దారుకు సర్కారువారు యిచ్చివేయరాదనియు, ఏ ఆసామి వద్దనుంచి, లేదా ఏ రైతువద్దనుంచి సర్కారువారు వాటిని తీసికొనియుండిరో వానికే ఆ భూములను తిరిగి యివ్వవలెననియు, వారి హక్కు భుక్తములను వారికి తిరిగి యధాప్రకారంగా కలుగజేయవలెననియు కోరుచున్నట్లుగా ఇండియా గవర్నమెంటువారికి తెలిసినది. అనాది ప్రప్రధమ భూఖామందైన జమీన్‌దారుకు ఆ భూములను ఒప్పజెప్పుటకు గవర్నమెంటువారు ముమ్మందుగా నిరాకరించెదరు. అది గవర్నమెంటువారు అవలంబింపదలచిన వ్యవహారపద్ధతియైయున్నది. ఈ విషయమై రాష్ట్రీయ ప్రభుత్వములతో ఇండియా గవర్నమెంటువారు సంప్రతించుచున్నారు. ఏ ఆసాములవద్దనుంచి, ఏ రైతులవద్దనుంచి సర్కారువారు యీ భూములను యుద్ధావసరములకై తీసికొనుచున్నారో, ఆ భూములను సర్కారువారు తిరిగి వదలివేయునప్పుడు సదరు ఆసాములయొక్కయు, రైతులయొక్కయు హక్కు భుక్తముల విషయమై గవర్నమెంటువారు తప్పక శ్రద్ధ వహించగలరని ప్రస్తుతము అభయ మివ్వడమైనది.

# బర్మానుంచి శరణార్థులు : విమానాలమీద వచ్చినవారు 11,210 మంది.

బర్మానుంచి ఇండియాకు చేర్చబడిన శరణాగతుల సరియైన లెక్క వివరములను ఇప్పుడు అధికారరీత్యా యివ్వగల్గుచున్నారు. 1942 జనవరి 1 వ తేదీ మొదలు 1942 మే నెల 9 వ తేదీ వరకు బర్మానుండి ఇండియాకు విమానాల మీద చేర్చబడిన శరణాగతుల సంఖ్య 11,210 మందియని లెక్క తేలినది.

రంగూను, లాషియో, మాగ్వే, ష్వెబో అను పట్టణములనుండి చిట్టకాంగుకు, కలకత్తాకు విమానాలమీద 5,116 మంది చేర్చబడిరి. ఉత్తర బర్మాలోని మిట్కయిను నుండి అస్సాము రాష్ట్రానికి 6,094 మంది చేర్చబడిరి. మొదటచెప్పిన 5,116 మందిలో 1,830 మంది భారతీయులు, 3,060 మంది యూరోపియనులు ఆంగ్లో యిండియనులు కలరు. తరువాత చెప్పబడిన 6,094 మందిలో 2,195 మంది భారతీయులు, 291 మంది యూరోపియనులు, 2,516 మంది ఆంగ్లో యిండియనులు,408మంది ఆంగ్లోబర్మనులుకలరు.

## రష్యాకు మిత్రరాజ్యాల సహాయం.

అమెరికావారి మెట్ట పటాలములు, విమాన దళములు, ఇప్పుడు ఇంగ్లాండుకు చేరియున్నవి. జర్మనీమీదకు దూకుటకు సిద్ధముగా వేచియున్నవి. యూరోపు యుద్ధరంగమునకు పంపబడుచున్న అమెరికను సేనలకు సర్వ సేనానిగా, జనరలు ఎల్సెను హవరుగారు నియమింపబడియున్నారు. త్వరలోనే జర్మనీమీద దెబ్బ కొట్టబడును. ఆ దెబ్బ అతిదారుణమైన దెబ్బ. జర్మనీ ఆ దెబ్బకిక తాళజాలదు.

## మద్రాసు పటాలములో జనహాని.

ఈ క్రిందివారికి అపాయము కలిగెనని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

గాయపడినవారు.

ఐ జి.యస్.సి. , జి.యస్ యఫ్. 1847 ; డబ్ల్యు.పెయిటరు మునిస్వామి.

MADRAS PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.